సంపుటి 9

సంచిక 3

ఫోన్ నెం. 1087

రిజిష్టర్డు నెం.

హెచ్ – 103




ధరల నదుపులో

ఉంచేందుకు

సహాయ పడండి.

* * *

దేశరక్షణకోసం

పొదుపుచేయండి.

ఎడిటర్ : జిల్లేపల్లి భాస్కరరావు

విశ్వావసునామ సంవత్సర ఫాల్గుణ శు॥ నవమి మంగళవారము 1—3—1966

# రాజ్యాంగంలో రవాణావసరాలు

రాజ్యాంగ వ్యవస్థలో రక్షణకు, శిక్షణకు పర్యవేక్షణకు, పరిపాలనా సౌలభ్య దక్షతకు రవాణా సౌకర్యాల పెంపుదల అత్యావసరం. ప్రణాళికా రచయితలు ఈ విషయప్రాధాన్యతను గమనించి నడుచుకోవడం ఎంతైనా అవసరం. సుస్థిరపద్ధతులమీద సుశిక్షిత విన్యాసాలకు వసతులు కల్పించబడినప్పుడే అవసరాల కనుగుణముగా అభివృద్ధిని సాధింపగలుగుతాము. ఈ పెంపుదలకు అటు ప్రభుత్వరంగమేగాక, ప్రయివేటురంగంలోకూడా విస్తృతావకాశాలు కలవన్న సంగతి మరువరానిది. రెండు ప్రపంచ యుద్ధాలుదాటినా రాజకీయంగా దేశాంతర్గతమైన ఘర్షణకు ప్రజల పరిస్థితులు సంకటాలకు తారసిల్లి బయటపడ్డా రవాణా పెంపుదల సరిగ్గా గుర్తింపబడలేదు. మంచిరోడ్లు దేశం నలుమూలలా కలుపుతూ నిర్మింపబడకపోవటం వలననున్నూ మనము సాగింపదలచిన ప్రణాళికావసరాలకు తగినట్టుగానైనా రోడ్లనిర్మాణం సాగకపోవటం మనకే ప్రమాదాన్ని కల్పిస్తుంది. దానికి తగినట్టు రవాణాశకటాల నిర్మాణ యంలోకూడా సక్రమమైన కార్యక్రమ పొందింపబడలేదు ఈ లోపానికి ముఖ్య విషయం తెలుసుకున్నవారిస మోటారుకారు ట్రక్కులవు క్రమాలకుపోను, ప్రజా బడటం సబబేఅయినా,

దవ్య లోపమో, శిక్షణలోపమో, కావలసిన సమూనాలు కాక, మరొకదానిని తయారుచేయడానికి అనుమతించే అలవాటు సాగటంవలననో చిక్కులు ఏర్పడి ప్రణాళిక మొత్తానికి వుత్పత్తి జరుగలేదు. జరిగినవి సక్రమంగా పంపిణీపొందక పోవటం, పంపిణీఅయి, వాడకంలోవున్నవాటికి, కావలసిన ఆయిల్ సరఫరాగాని, సామానుల అరుగుదలను పూడ్చేందుకు స్పేర్సు సప్లయిగాని, టైర్ల సప్లయిగాని కుంటుబడటం జరుగుతూనేవుంది. వినియోగదారునకు తగినంతఆర్థిక స్థోమతు లేక ఆయా శకటాలను నడిపేందుకు తగిన శిక్షణపొందిన డ్రైవర్లులేక రవాణాసౌలభ్యము ఊహించినంతగా సులభతరం గాక, సమస్య లధికమై సతమతమయ్యేదిగా తయారయింది ఇన్ని కష్టనష్టాలకు గురవుతూ సాగింపబడే రవాణాసౌకర్యం రాజ్యాంగబాధ్యతల దృష్ట్యా చట్టబద్ధము చేయబడింది. కాని చట్ట నిర్వహణాల్లో అన్ని లోపాలే కనిపిస్తున్నవి. 1957 నాడు ప్రవేశపెట్టి అమెండుమెంటు చట్టము 1965 నాటికి తిరిగి అమెండుచేయాల్సి వచ్చింది దీనికి కారణం ముఖ్యంగా సౌకర్యాల పెంపుదలగాని, పరిశ్రమాభివృద్ధిగాని మాత్రం కాదు. అధికారాల పెంపుదలతోపాటు వ్యాఖ్యాన విపులీకరణకు జరిగిన సాధనమాత్రమే గోచరిస్తుంది నిజ మాలోచిస్తే ఏ చట్టమైనా ...రూపొందించబడేటప్పుడు పరిశ్రమ దారులు, ప్రభుత్వాధికారులు కలిసికట్టుగా పని ...ంతవరకూ విభిన్నదృష్టిని ప్రదర్శింప ...విషయగమనిక జరగాలిగాని చట్ట ...కపోయినా, అర్థంచేసి ప్రజ ...ను ఎరుకచేయకపోయినా తప్పులెన్ని పెనాలిటీలువేసే ధోరణిలో ప్రభుత్వాధికారులుసాగటంవలన తప్పు-ఒప్పుల తేడా తెలియక తప్పులుపాలుగావటం పరిశ్రమలోని వారి వంతుగా కనిపిస్తుంది నిత్యజీవితంలో భాగమైన రవాణావసరాలు రాజ్యాంగం దృష్టిలో చాలా నీరసంగా చూడబడి, ఆర్థికంగా కేటాయింపులు తగ్గియున్నా, అధికారరీత్యా ఆడంబర రహితమైన ఔదార్యపద్ధతులు సాగకపోవటం వలన 1947 నకు పూర్వం గృహపరిశ్రమగా వర్ణించడానికి సావకాశంవున్న రవాణాపరిశ్రమ ఈనాడు పెట్టుబడివ్యాపారంగా మారి, ఎక్కువ మందికి అందుబాటులోలేని కారణాన నిర్వీర్య వలన నిరుద్యోగసమస్యతోబాటు గొప్ప దెబ్బ తినటం గమనింపవలసియున్నది రాజ్యాంగ బద్ధంగా ప్రజాశ్రేయస్సునుగోరే ప్రభుత్వం రవాణావసరాల పెంపుదలకు దోహదంచేయడానికి పూనుకోవాలిగాని, రవాణాపరిశ్రమకుదెబ్బ తీయరాదు ప్రణాళికారచన నాటినుండి నిర్వహణాకాలందాటి అభివృద్ధినందేంతవరకు కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాలు సులభతర రవాణావకాశాలను గమనించటంవలన దేశ సౌభాగ్యం పెంపొందగలదు

—o—



— మనవి —

1965 సంవత్సరపు రవాణా సమాచార్ చందాలు చెల్లించని చందాదారులు వెంటనే చందాలు పంపాలని ప్రార్థన. ఇకముందుకూడా మామూలుగా చందాలు చెల్లిస్తూ సహకరించాలని కోరడమైనది



# ఆంధ్రప్రదేశ్‌లో ట్రాక్టరు ట్రయిలరు సర్వీసులు

భారతదేశంలో ట్రాక్టరు ట్రయిలరు సర్వీసులంటూ నిర్మాణావకాశాన్ని కల్పించి, ప్రభుత్వంవారు చట్టబద్ధంగా వ్యవసాయాభివృద్ధికి వాడాలని ఊహించి, అట్లా వాడబడేవానికి పన్నువసూలు మినహాయించాలని నిర్ణయించారు. ఈ నిర్ణయంవలన ప్రభుత్వ దృష్టిలో రైతునకుగల స్థానాన్ని మనం గ్రహింపగలం. రైతు సామాన్యంగా తన వ్యవసాయపుపనుల నిమిత్తం జంతువుల లాగబడే వ్యవసాయపు పనిముట్లు, బండ్లు వాడుతూ వుంటాడు. వాటి స్థానే వుపలక్షింపబడిన ఈ ట్రాక్టరు ట్రయిలరు కాంబినేషన్లు ఈనాడు వాడుకలోనికి రావాలని ప్రభుత్వం కృషిచేస్తున్నది. ఈ కృషికి కారణం ఒక్క వ్యవసాయాభివృద్ధి అని చెప్పవచ్చు. అలాగే పెద్దరైతుకు వసతిని పెంపుచేయటం ద్వారా ఊహించదగిన అభివృద్ధికైగాని, పదిమంది కలసి సాముదాయకంగాచేసే సహకార వ్యవసాయ సాధకంగా సాగించేందుకు గాని ట్రాక్టరు ట్రయిలరు వాడకాన్ని గుర్తింపవచ్చు. వ్యాపారదృష్టితో రవాణాసాధనంగా గుర్తించటానికి అత్యధిక బరువులను రోడ్లులేని కచ్చా ప్రాంతాలలో సహితం చేరవేయటానికివి వాడబడటం ఆశ్చర్యంకాదు.

రైతు తన బాధ్యతలు పూర్తిగా గుర్తించి, బండీ-గొడ్లను అటు వ్యవసాయానికేగాక, వ్యాపారం నిమిత్తం రవాణాసాధనంగా వాడే సావకాశంవుంది. అది తక్కువపెట్టుబడితో పెద్ద నష్టంలేకుండా అత్యధికసదుపాయాం కల్పించటంవలన ట్రాక్టర్లజోలికి సామాన్య రైతులు పోరు. కాని, సాళువ-దాళువ పంటలపెంపకం ప్రోత్సహించే ప్రభుత్వపథకాలవలన భూమిని లోతుగా-గుల్లగా దున్నటానికి జంతువుల శ్రమ చాలకయున్నా, ట్రాక్టర్ల వినియోగానికి ఆధునిక సాంప్రదాయంగా ప్రభుత్వంవారు రైతులకు అప్పుగాయిచ్చు అవకాశం అందుబాటు ఏమురించడంవలన కొంతమంది ట్రాక్టర్లు ట్రయిలర్లు వాడుతుండటం గమనింపదగినదే. వీనివాడకం కేవలం రైతు తన అవుసరాలకేగాక కిరాయి తీసుకొని వ్యవసాయపు పనులకుగాని, వ్యాపారపు పనులనిమిత్తంగాని వాడుతూవుండి అట్టి కార్యక్రమాలకు వాడబడే లారీలులాంటి శకటాల యజమానులకు నష్టంకలిగించటం గమనింపబడినందున లారీలులాగానే వాడబడే ట్రాక్టరు ట్రయిలర్లకు పన్నువసూలు చట్టబద్ధం చేయబడింది. కాని, ఈ ఔదార్య ప్రకరణలో పరిశీలనాధికారుల అనుభవంమేరకు ట్రాక్టర

ట్రయిలర్లు వ్యవసాయ కార్యకలాపాలకే గాక, వ్యాపారకలాపాలు సాగించడం గుర్తించి, పన్ను వసూలు చట్టాన్ని పకడ్‌బందీగా అనువర్తింపబూనుకున్నారు.

నిర్మొగమాటంగా అధికారులు చట్టవిరుద్ధంగా వాడబడే ట్రాక్టరు ట్రయిలర్లను పట్టి పన్ను వసూలయ్యేదాకా నిలిపి, రైతుపై అధికమైన వత్తిడి తెచ్చేటప్పటికి రైతు తట్టుకోలేక వాడుకనే మానుకోవడంతో వ్యవసాయం కుంటుపడి ఆర్థికంగాకూడా బహుయిబ్బందికి గురవుతున్నాడు. ఈ విధంగా శిక్షణక్రింద కేసులబనాయింపుతో రైతును పిండివేసేకంటే ప్రతి ట్రాక్టరు ట్రయిలరుకూ కొంతసొమ్ము సాలీనా చెల్లించే పద్ధతిని ఏర్పరచి, కేవలం వ్యవసాయానికే వాడుతూ రోడ్లపై వాడిక లేనట్టివారికి రెవిన్యూశాఖవారి సలహాపై సొమ్ము ముదరా ఏర్పాటుచేయటం సబబని యిప్పుడుసాగే నిత్యశిక్షణకార్యక్రమాలను వినియోగించే సిబ్బందిని తగ్గించటం ద్వారా ప్రభుత్వాదాయం పెరగగలదని అభిజ్ఞులు విన్నవించటం జరిగింది ప్రభుత్వం దాన్ని పెడచెవిని పెట్టేవుంది. వ్యవసాయాభివృద్ధి కుంటుపడిపోయింది. పన్నువసూలుచట్టంప్రకారం పట్టుకొన్న ట్రయిలరు ట్రాక్టరులకు పన్ను చెల్లింపుతోపాటు విధించే పెనాల్టీలబరువు మరీ హెచ్చించటంకూడా శోచనీయమై, వూహించిన వ్యవసాయాభివృద్ధి దెబ్బతిన్నది. రైతులు చాలా యిబ్బందులకు గురిఅవుతున్నారు. ఇటు గ్రామీణ రవాణా దెబ్బతినటమూ, అటు వ్యవసాయం దెబ్బతినటం అనేది యీ అవ్యక్తపుస్థితివలన జరుగుతుంది. కనుక ప్రభుత్వంవారు ఈ సమస్యను సావధానంగా పరిశీలించి, తగిన మధ్యే మార్గాన్ని స్వీకరించి, రైతుజీవనంపై దాడి జరుగకుండాచూచి, రైతు శ్రేయస్సును—సౌభాగ్యాన్ని కాపాడవలసిన అగత్యం వుంది.

కృష్ణాజిల్లాలో కనుగొనబడిన ట్రాక్టరు ట్రయిలరు కేసులను అనుభవంతో కృష్ణాజిల్లా రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు శ్రీ డి. వి. యల్. నరసింహామూర్తిగారు యిచ్చే సలహాను గమనించి, ఐనా రైతులు ప్రభుత్వంతో ఈ విషయ నిర్ధారణవలన ఒకదారి సాఫీగా పొందేలోగా తగినట్టు పర్మిట్లుపొంది, బ్రేకులుచేయించి, పన్నులుచెల్లించి ఇన్సూరెన్సు కట్టనిదే ట్రాక్టరు ట్రయిలరు వాడకాన్ని నిలిపివేయటం మంచిది. ఒకతప్పునే తిరిగి రెండవసారి చేస్తే ఆర్థికనష్టంతో పాటు అనేక కష్టనష్టాలకు గురికావలసివస్తుంది రైతులుకూడా దీన్ని గమనించి రాజ్యాంగబద్ధముగా నడచుకోవాలని హితవు సూచించడమైనది

—0—

# చరిత్రసార్థకమైన ఆర్. టి. ఏ. సమావేశం



1940 మోటారుకోడ్ ననుసరించి, ఏర్పడిన రీజనల్ ట్రాన్సుపోర్టుఅధికారితో సమావేశాలు రీజనల్ ట్రాన్సుపోర్టుఆఫీసు ఆవరణలో ఇంత వరకు జరుపబడి వుండలేదు. ఈమధ్య కృష్ణా జిల్లా రీజనల్ ట్రాన్సుపోర్టు అధారిటీవారు విజయవాడలోని ఆర్. టీ. ఓ. ఆఫీసులో సమావేశమైనారు. ఈ విచిత్రానుభూతి పలువురు ఆపరేటర్ల కనివారికి సంభ్రమాశ్చర్యాలు కలిగించింది.

ఆర్. టి. ఏ. మెంబర్లను అభినందించబోయినవారితో కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ జయకర్ పి. జాన్సన్‌గారు "మీ రెందుకు సంతోషించాలి" అని ప్రశ్నించారు. ఇది సరియైన ప్రశ్నే. దీనికి సమాధానం లేకపోలేదు. ఆర్. టి. ఏ. మెంబర్లు మోటారుబండ్ల చట్టంలోని వివిధములైన చట్టనిబంధనలను అమలుజరిపించేందుకు ఆర్డర్లు జారీచేస్తారు. అట్టినిర్వాహణలో వారు ప్రభుత్వపు తాఖీదులకు, రాష్ట్రట్రాన్సుపోర్టు అధారిటీవారి అదుపాజ్ఞలకు మాత్రమే లోబడి, చట్టబద్ధంగా తమకుగల అవకాశాన్ని కూడా వినియోగించుటలేదు. నిజాయితీకినిలబడి వాస్తవదృష్టిని కోల్పోకుండా విచక్షణాయుతముగా పరిశ్రమదారుల, పనివారల యిబ్బందిసబ్బందులను కాలగాన పరిస్థితుల కనుగుణముగా సముదాయంతో సర్దుకొంటూ చట్టనిర్వాహణ దెబ్బతినకుండాను, పరిశ్రమ పాడుకాకుండాను వుండేందుకు తమ నియంత్రతను సార్థకపరచుకొనలేకపోతున్నారు. సాధక బాధకాలు తెలుసుకొనేందుకు వారుగూడా పరిశ్రమదారుల పరిసరాలలో మెలగి వారికి తరుచు కనిపిస్తూ వుంటే అవసరమైనప్పుడైన పరిదారుల యిబ్బందులు తెలుపుకో యిప్పుడు ఎక్కడో ఎప్పుడో అతి వ్యవధిలో కలసి మీటింగ్ ఏ

వివరణకూడా గమనించటానికి వీలు లేనట్టు ప్రభుత్వపు పాలనాదృష్టిలో మాత్రమే వ్యవహరించే అధికారులను అడిగేవారూ తక్కువే. అవకాశం తీసుకుని ఆలించేవారూ తక్కువ. ఈ అంతరమ భేదాన్ని తగ్గించేందుకు తమకుగల ఇతర ప్రధాన బాధ్యతలమధ్య ఈ శాఖలోని ముఖ్యమైన తమ పాత్ర ప్రాధాన్యాన్ని గుర్తించేందుకు ఆర్. టి. ఏ. మెంబర్లు నెలకొకసారి



యైన ఆర్. టి. ఓ. ఆఫీసు పరిసరాలను గుర్తించుకుని వస్తూవుంటే ఆయా ఆఫీసుపంచల్లో పని తెమలని పనులకోసం వేచేవారిస్థితి చూచేందు అపరిష్కృత సమస్యలను గుర్తించి వర్తించుకు కొంతలోకొంత సావకాశం కలుగకను యీ సావకాశాన్ని ద్విగుణీకృతంను వీరి సమావేశం ఆర్. టి. ఓ ఆఫీరగటం అతిముఖ్యమని గుర్తింపబడినది. వీలైన అధికారపద్ధతిలోని అంతర్యమూ యిదే.

సమావేశంలో అధ్యక్షతవహించిన కలెక్టరుగారు, ఉపాధ్యక్షులుగావున్న జల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ టి పాపన్నయ్యగారు మెంబరుగావున్న హైవేస్ యింజనీయరు శ్రీ యం. సోమేశ్వరరావుగారు ప్రజా ప్రతినిధిగా వున్న శ్రీ పి పమిడేశ్వరరావుగారు సమావేశాన్ని అభినుతించే ఆపరేటర్ల ఉత్సాహాన్ని మెచ్చుకున్నారు. చట్టవిరుద్ధంగా సంభవించే తప్పులను తగ్గించేందుకు మాత్రమే అధికమైన పెనాలిటీవిధింపు ఏర్పడిందని లారీఓనర్లు - పనివారు తప్పులసంఖ్య తగ్గించుకొనేందుకు శ్రద్ధ తీసుకోవాలని చెప్పారు. రోడ్డు ప్రమాదాలను తగ్గించి, ప్రజారక్షణ కలిగించేందుకు వీలుగా ఓనర్లు - డ్రైవర్లు అత్యధికమైన శ్రద్ధవహించాలని, పోయిన ప్రాణాన్నిగాని, చెడిపోయిన వస్తువునుగాని తిరిగి పొందటం సాధ్యంకానిపని గనుక ఈ సమస్యాపరిష్కారానికి వారి సహకారం అవసరమని చెప్పారు. డ్రయివర్ల నిర్లక్ష్యమే కారణంగా చెప్పబడే ప్రమాదాలతగ్గిం తగ్గింపుకు ముఖ్యంగా డ్రయివర్లకు శిక్షణతరగతులు నడిపే పాఠశాలలుఅవసరమని ప్రబోధించారు. వీనినిపరిశీలిస్తామని చెప్పారు ఈప్రమాదాలకు ముఖ్యంగా చెడిపోయినరోడ్లు, వెడల్పు తక్కువైన రోడ్లు కారణమనికూడా గుర్తించారు. హైవేస్ ఇంజనీర్ శ్రీ సోమేశ్వరరావుగారు అందులోని కృష్ణాజిల్లాలో డెల్టాప్రాంతంలోగల రోడ్లు కాలువగట్లపైనో, ప్రక్కగానో వేయబడివుండటంవలన వర్షాలదెబ్బకు యెప్పటికప్పుడు దెబ్బతినిపోతున్నాయని చెప్పారు వాని

# నెల్లూరుజిల్లా లారీ ఓనర్సు అసోసియేషన్



బి. కృష్ణారెడ్డి, (ప్రెసిడెంటు) – హెచ్. సాంబమూర్తి, (ట్రాన్సుపోర్టు కమీషనర్)
పి. నరసింహాస్వామి, (సెక్రటరీ)

ఆంధ్రప్రదేశ్ ట్రాన్స్‌పోర్టు కమీషనరు గారు యీ మధ్య నెల్లూరు లారీ ఓనర్సు అసోసియేషన్‌వారి ఆహ్వానాన్ని గుర్తించి ఎసో సియేషన్ వారి ఆహ్వానాన్ని గుర్తించి ఎసోసియేషన్ వారిని దర్శించారు శ్రీ కమీషనర్ గారికి అందజేయబడిన మెమొరాండములో ఓవర్‌లోడ్ తగ్గించేందుకు నెల్లూరు జిల్లా లారీ ఆపరేటర్లుతీసుకొన్న దీక్ష వలనకలిగినఫలితాలు చెప్పబడినాయి ఈ మంచి ఫలితాలను అత్యధికంగా పొందటానికి వీలుగా ప్రత్యేక సంచార పర్యవేక్ష దళాన్ని నియోగించాలని కోరారు. ఓవర్‌లోడ్ నివారించేందుకు ప్రభుత్వాధికారులు చూపే శ్రద్ధను సహకారాన్ని కొనియాడారు.

నిర్వహణకు రోడ్లు మరియు బిల్డింగ్ డిపార్టు మెంటువారికి యిచ్చు గ్రాంటు చాలదని. కాల్వగట్లు నిర్వహించే పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటు వారు, యిర్రిగేషన్ డిపార్టుమెంటువారు కూడా కొంతసొమ్ము వ్యయపరచి జిల్లాప్రాంతపు రోడ్ల నిర్వహణకు దోహదంకలిగించాలని చెప్పారు మూలమూలల పండేపంటల సరకు సరఫరాకు రోడ్లు ప్రధానం కనుక ఈ సలహా సబబైనదే అనవచ్చును విజ్ఞాపనలు వినిపించినవారి మాటలకు విసుకుజూపక ఓపికతోవిని, తగినరీతిని హదం కల్పిస్తామని చెప్పిన కృష్ణాజిల్లా టి. ఏ. సభ్యులకు కృతజ్ఞతాపూర్వకవం సమర్పింపబడినాయి.

డ్రయివర్లు మాత్రమే బాధ్యులయి ఓనర్లకు తెలియకుండా చేసే తప్పులకు ఓనరు శిక్షింప బడటం చాలా శోచనీయమని చెప్పారు డ్రయివర్ల మంచి చెడ్డలు ముందుగా గుర్తించడం కష్టమని తీరా తెలుసుకొన్నాక తీసివేయా లంటే లేబర్ రూల్సు అభ్యంతరాలు కలిగిస్తాయని అంచేత అధికారులతో ఓ కంట ఆపరేటర్లను దయదలచమని చెప్పవలసిందిగా కోరారు.

టవుట్లుగా చెప్పబడే కొంతమంది వ్యక్తుల ప్రవర్తనవల్ల ఆఫీసులో పనిచేసేవారికి ఆపరేటర్లకుమధ్య వుండవలసిన బాంధవ్యం సన్నగిల్లిందని అంచేత తాము అధికమైన సొమ్ము కోల్పోతున్నామని చెబుతూ తమ పనుల నిర్వహణకు టవుట్ల మద్దతు తప్పనిసరి గనుక అట్లా జరుగకుండా నిరోధిస్తూ అధికారులు ఆపరేటర్లను గుర్తించి గౌరవించేందుకు వీలు కల్పించాలని కోరారు. ఆపరేటర్ల యూనియన్‌ను గుమాస్తాలకు మాత్రం స్థానం కల్పించాలని కూడా చెప్పారు లారీలలో యీ మధ్య క్యాబిన్‌లో యిరువురు మాత్రమే కూర్చొనే సావకాశం కల్పించినందున సరుకు దారు గాని లారీ ఓనరు గాని బండి వెంట వెళ్లవలసి వచ్చినపుడు వీలుకలగటంలేదని భద్రతా సూత్రాల దృష్ట్యానైనా ముగ్గురు కూర్చునే వకాశాన్ని కలిగించాలని కోరారు. మెము డాన్ని విన్న కమీషనర్ గారు పై అంశాలు ంచి తగిన వసతులు వీలున్నంత వరకు లమని హామీ ఇచ్చారు.

మహారాజశ్రీ విజయవాడ 1వ డి॥ ము॥ కోర్టులో

Sc. 794/65 E,P. 841/65.

సి వి. రాఘవయ్య (D.H.R.)

and

పోతుకుచ్చి సరస్వతమ్మ (J.D.R.)

యీ నెంబరు డిక్రీబాకీ క్రింద మీతాలూకు పై కోర్టులో O.S. 589/58 లోని ముత్తమును జప్తు చేయుమని పిటిషను పెట్టగా మీకు నోటీసు నిమిత్తం ది 9. 3_66 కు వాయిదా వేసినారు. మీరు హాజరుకానియెడల మీ పరోక్షమందు విచారించబడును

(సం) దాసు అనిరుద్ధరావు,

D.H.R. Advocate.

# రవాణా సమాచార్

ఆంధ్రప్రదేశ్ నందు తెలుగులో ప్రచురింప బడిన ఒకేఒక రవాణాసమస్యలకు సంబంధించిన

మాసపత్రిక.

| | |
|---|---|
| సంవత్సరచందా | రు 3_00 |
| విడిప్రతి | రు 0_25 |

ఆంధ్రప్రదేశ్ యందన్ని చోట్ల ఏజంట్లు లేని ప్రదేశములందు ఏజంట్లు కావలెను.

'రవాణా సమాచార్', విజయవాడ_2.

# హెచ్చుపన్ను పరిశ్రమల నిర్మాణసౌష్టవాన్ని దెబ్బతీస్తుంది.

ఆల్ ఇండియా మోటారు యూనియన్స్ కాంగ్రెస్ ప్రచురణ

దేశ రక్షణ నిమిత్తమును దేశాభివృద్ధికిని కూడ అవసరముగా ధనరాబడి మార్గములు శీఘ్రకాలములో నావశ్యకములనుట నిస్సందేహమే. ప్రస్తుత పరిస్థితి దురదృష్టవశాత్తు మన రెండు పొరుగు దేశ రాజ్యములవారిచే కారణభూతమై నిజముగా ప్రమాదకరమై యెడతెగని మొగులవ, సంసిద్ధతతో నుండ నగత్యమైనదే ఇది మన జవాన్లకు నాయుధ సామగ్రి వగైరా అందుబాటుతోపాటు ఆర్థికముగా స్వయం సమృద్ధి కలదిగాగాని లేక కనీసము స్వశక్తిపై నాధారపడి యుండగలిగినదిగా నుండిననేసాధ్యపడును. దేశ రక్షణకవసరమగు ధనము సేకరించుటకు మన ప్రణాళికలను విరుగగొట్టుట కొట్టి సావకాశమును కలుగజేయుటలేదు. గనుక నే పన్నుల మూలముననే తదితరముగా అధికమగు రెవిన్యూను సముపార్జన చేయగల మార్గాంతమిది యొక్కటియే

దని పోరుచున్న తీరు యెవరికైనను చకితులను చేసివైచును. చాలా యేండ్ల నుండియు నీ పరిశ్రమపై పన్నుల భారము అత్యధికముగా నుంటూయున్నది. దానినేదైన కొంత తేలికపరచుటకు బదులుగా, రాష్ట్రప్రభుత్వమును, కేంద్ర ప్రభుత్వమునుకూడ మినహాయింపేమియు లేకుండా యేటేటను క్రొత్త పన్నులు వేయుటచేతను కూడాను లేక ఉన్న పన్నుల పెంచుట చేతగాని దానిపై భారము నధికము చేయుచుండిరి రాజ్యపాలనావిధానము (కాన్స్టిట్యూషన్) లో నిర్వచింపబడి యుండవలసిన మోటారు బండ్లపై పన్ను విధించునధికారము గల సూత్రము లేవియు లేని స్థితిలో యీ పరిశ్రమ వేయబడిన అన్ని పన్నులును కాకుండా యింకా యెక్కువ పన్నులను కూడ భరించగలిగిన స్థితిలో నున్నదని యెప్పుడును వాదించబడుతు వచ్చుచున్నది.

కాని క్రొత్త పన్నులు విధించునపుడుగాని ఉన్న పన్నులను పెంచునపుడుగాని తత్ఫలితముగా దేశపు ఆర్థిక మూలముపై ప్రతికూల పరిణామము కలుగకుండునట్లుగా జాగ్రత్త తీసికొనవలెను. లేనియెడల ముఖ్యోద్దేశ్యమునకే భంగము కలుగును. ఈ స్వల్పవిషయమును ప్లానింగ్ కమీషన్‌లో నున్నవారు యుపేక్షించి యుందురని కాదుగాని దాని డిప్యూటీ చైర్మన్ రాష్ట్ర ప్రధాన మంత్రులను మోటారు రవాణా పరిశ్రమపై పన్నులను హెచ్చింపు చేయవలసి

ఒక ప్రత్యేక నమూనాలో తయారుచేయబడు ట్రక్కు యొక్క ఖరీదు పై ప్రీమియమ్ లేక దాని కొరకై నిరీక్షించుచున్న వారి దీర్ఘ జాబితా లేక తాజా పరిమిట్లు కొరకు వచ్చిన బహుళ సంఖ్యాకుల దరఖాస్తుల వంటి అప్రస్తుతమగు అపోహాపూరితమగు కొం బద్ద నాధారముగా చేసికొని యిన్ని పన్నులున్నప్పటికిని (ఆపరేటర్లందరు యేడ్పులు బొబ్బలు పెట్టుచున్నను) యీ పరిశ్రమ గతిని పురోగగమించుచున్నదని

# టూరిస్టు వార్తలు

ఢిల్లీలో రంజిత్ అనే మరొక క్రొత్త హోటల్ టూరిస్టుల నిమిత్తం ఏర్పరచారు సింగిల్ రూము రోజుకు యిరవై రూపాయలు డబుల్ రూము 40 రూపాయలు అదనంగా రోజునకు భోజనం ఖర్చు పది రూపాయలు

ఢిల్లీ రెడ్ ఫోర్టులో అమర్చిన విధంగానే చారిత్రాత్మక, పౌరాణిక యితిహాస గాథలకు ఆధారమైన ప్రసిద్ధ ఘట్టాలకు సూర్యరశ్మి ప్రతిఫలక ప్రదర్శనాల వల్ల ఏర్పరచేందుకు మధురలో మీనాక్షి దేవళంప్రాంతంలోను, మద్రాసు మైలాపూరులోని గుడి వద్దను, గోల్కొండ ప్రాంతంలోను, మహాబలిపురం వద్ద, ఆగ్రా, ఫతేపూర్ సిక్రీ, జయపూర్. సబర్మతీ ఆశ్రమము ప్రాంతాలలో వీలుకలిగించ వచ్చును. టూరిజం డిపార్టుమెంటు వారి ఆధ్వర్యంలో నిపుణుల సంఘంచేతనిర్ణయాలు తీసుకో బడినవి

ప్రపంచం విలాస యాత్రా సంఘం వారిచే నడపబడే పతా సమావేశం 15 వది యీ మధ్య జనవరి 24న భారత ఉపరాష్ట్రపతి జాకీర్ హుస్సేన్ గారి ఆధ్వర్యాన జరుపబడింది ప్రియతమ నాయకుడైన లాల్ బహాదూర్ శాంతి యాత్రలో అసువులను వీడటం వలనన్నూ హిందూ పాకిస్తాన్‌ల మధ్య అనివార్యంగా కలి కలతలవల్లనూ ఘర్షణ వల్లను అనుకు త ఉత్తమ స్థాయిలో యీ సమావేశం ప్పటికి. సమాఖ్య అధ్యక్షుడైన శ్రీ ఎస్. భ్ గారి పరిశీలననుసరించి లోగడకంటే యీ సమాఖ్య కార్యక్రమాలలోపాల్గొనేందుకు పసిఫిక్ ప్రాంతరాజ్యాలులో యాత్రీకులు ఉత్సాహం చూపటంవల్లనన్నూ విలాస యాత్రను వ్యాపార దృష్టితో పెంపుచేయడానికి అవకాశాలు కల్గినందునన్నూ యిరుగు పొరుగు రాజ్యాల మధ్య అతిసన్నిహిత స్నేహసంబంధాలు పెంపొంది యాత్రాభినివేశం కల్గినందునన్నూ యీ సమాఖ్య ఆదర్శవంతంగా వున్నదని నివేదించారు

-: :-

బడుతూ వస్తోంది అయినప్పటికి యిదంతయు సరియైన తర్కము (హేతువాదము) గా కనిపించదని మనవి చేసికొననగును. రవాణా బండ్ల నుపయోగించు వారి పైకి అదనపు పన్నుల భారము తగిలేటట్లు చేయుట సామాన్యముగా తలచినంత యతి సులభము కాదు ఎందుచేత ననగా బస్సు ఛార్జీల పునఃపరిశీలన చేయబడు ప్రతి సందర్భమును అధికారులచే నామోదింపబడవలసి యున్నది. ఇక సరకుల రవాణా విషయములో కనీసపు రేట్లులేనికారణమునను, యీ పరిశ్రమ యొక్క స్వభావమగు గొంతుకలు కోసే పోటీ ఫలితముగా, మామూలు ఆపరేటరునకు న్యాయమైన రేటు కూడారాదు

పరిస్థితి యిట్లుండుటచే రోడ్డు రవాణా పరిశ్రమను (దయాదాక్షిణ్యములతో) సానుభూతితో చూచుట అవసరము ఈ పరిశ్రమపై యింకను పన్నులు వేయుటయను విషయములో క్రమేణా తగ్గిపోవుచున్న లాబడుల సూత్రము ప్రారంభమైనదా లేదా యనునది నిర్ధారణ చేసి తెలిసికోవలసి యున్నది.

(మిగతా 14 వ పేజీలో)

# యజమానులు - కార్మికులమధ్య ఇష్టపూర్వక సహకారం

కేంద్ర కార్మికమంత్రి, శ్రీ డి సంజీవయ్య హితవు.

యజమానులు, కార్మికులమధ్య ఇష్టపూర్వకమైన సహకారాన్ని సాధించడానికి పటిష్టమైన విధానం వుండాలని కేంద్ర కార్మిక ఉపాధికల్పన మంత్రి శ్రీ డి సంజీవయ్య ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో పరిశ్రమల యజమానులూ - కార్మికులమధ్య సంబంధాలగురించి నేడిక్కడ గోష్ఠిని ప్రారంభిస్తూ ఉద్బోధించారు

ఉమ్మడి రాజీవిధానం పెంపొందటానికి సరియైన, వ్యవస్థీకృతమైన కార్మికసంఘాలు అత్యవసరమనీ, ఈ విషయానికి కార్మికసంఘాల ప్రతినిధులు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వాలనీ శ్రీ సంజీవయ్య సూచించారు: ప్రతి విషయానికీ ప్రభుత్వంవద్దకు రాయబారం వెళ్ళకూడదని ఉమ్మడిరాజీవిధానం పూర్తిగా అభివృద్ధిచెందితే త్రైపాక్షిక వేతననిర్ణాయకసంస్థ ఎంతో మెరుగుపడగలదనికూడా ఆయన అన్నారు.

పారిశ్రామికవివాదాల పరిష్కారాన్ని గురించి ప్రస్తావిస్తూ, అసలు వివాదాలు తలెత్తకుండాచూడటమే ఉత్తమమార్గమన్నారు కార్మికులు తమకోర్కెలను విన్నవించుకోడానికి సముచితమైనవిధానంవుండి వివాదాలను కార్మికసంఘాల ప్రతినిధులతో ముఖాముఖి చర్చించడానికి యజమానులు ముందుకువచ్చినప్పుడే వివాదాలను నివారించడం సాధ్యమౌతుంది. ఈ వివాదాలను పరస్పర సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవటంసాధ్యంకానప్పుడు స్వచ్ఛందంగా పరిష్కర్తద్వారా పరిష్కారం చేసుకోవటమే గౌరవప్రదమైన పద్ధతని శ్రీ సంజీవయ్య వక్కాణించారు.

పురోగామి దేశాలలో గడించిన అనుభవం మీద రూపొందించేపారిశ్రామికవిధానం భారతదేశ పరిస్థితులకు సరిపడకపోవచ్చనీ, అందువల్ల విదేశీ పద్ధతులను దిగుమతి చేసుకోరాదనీ, యజమానులనూ, కార్మికులనూకూడా ఆయన హెచ్చరించారు కార్మికులయొక్క ముఖ్యంగా గ్రామప్రాంతాలనుంచివచ్చిన కార్మికులయొక్క మనస్తత్వాన్ని యజమానులు అర్థంచేసుకుని సానుభూతిపూర్వకమైన దృక్పథాన్ని వారిపట్ల కలిగివుండాలని ఆయన సూచించారు. గ్రామాలలో వదలివచ్చిన సంఘజీవితాన్ని నగరాలకు వచ్చిన కార్మికులతో పునరుద్ధరించడానికి కార్మికులు చేయగలిగినది ఎంతోవున్నదని శ్రీసంజీవయ్య అన్నారు

శ్రీ సంజీవయ్య ప్రసంగం పూర్తిపాఠం:

"ఈ గోష్ఠిని ప్రారంభించడానికి నన్ను ఆహ్వానించినందుకు మీకు నా అభినందనాలు. మన పొరుగుదేశ చర్యఫలితంగా మనదేశంలో ఏర్పడిన అత్యవసరంపరిస్థితిని యజమాని - కార్మిక సంబంధాలను మెరుగుపరచటం మనం ఊహించుకున్నంత గడ్డుసమస్య కాదని నిరూపించింది. మన స్వాతంత్ర్యానికే విపత్తు సంభవించినప్పుడు మనలోవున్న విభేదాలన్నిటినీ విస్మరించి, ప్రాతిపై నడపగలమని నిరూపించాం. మానులూ, కార్మికులమధ్య ఇప్పుడున్న

క్యతి మామూలుపరిస్థితులలోకూడా నిలిచివుండ డానికి పద్ధతులను అన్వేషించడమే ఈ గోష్ఠి లక్ష్యం. ఈగోష్ఠిలో పాల్గొనేవారందరూ యజమాని, కార్మిక సంబంధాలను సంబంధించిన దైనందిన సమస్యల పరిష్కారంలో నిష్ణాతులే. దీర్ఘోపన్యాసాలు చేయకుండా, ప్రామాణిక గ్రంథాలనుంచిఉటంకించకుండా వాస్తవికదృక్పథాలతో చర్చలు కొనసాగిస్తారని నేను ఆకాంక్షిస్తున్నాను.

ఈ భావన నే ముఖ్యమైనవని నేను తలచిన కొన్ని అంశాలను ప్రస్తావిస్తాను యజమాని – కార్మిక సంబంధాలు మానవులమధ్య వుండవలసిన సత్సంబంధాలలో భాగమేనన్న విషయం గుర్తుంచుకోవాలి ఆధునిక సాంకేతిక శాస్త్రం, ఉత్పత్తివిధానాల ఫలితంగా పారిశ్రామిక కార్యకలాపాలు ప్రపంచమంతటా ఒకేవిధముగా వున్నప్పటికీ పరిశ్రమలలో పనిచేసేకార్మికుల పరిస్థితిమాత్రం వివిధదేశాలలో వివిధ రకాలుగా వుంటున్నది. చారిత్రక, నైసర్గిక, సాంఘిక, తదితర పరిస్థితులనుబట్టి అవి భిన్నంగా వుంటున్నాయి కార్మికులశ్రేయస్సు దృష్టిలో పెట్టుకుని రూపొందించేవ్యవస్థే చరస్థాయిగా వుంటుంది ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ పరిస్థితిని పరిశీలిద్దాం. ఇది వ్యవసాయరాష్ట్రం. మన రాష్ట్రంలోని ఒకకోటి 70 లక్షలమంది కార్మికులలో మూడులక్షలకంటె తక్కువమంది పరిశ్రమలలోను, గనులలోను పనిచేస్తున్నారు పరిశ్రమలలో పనిచేసేవారుసైతం స్వతహాగా వ్యవసాయమంటే అభిమానంగలవారే అందువలన ri మన సత్వం పారిశ్రామికజీవితానికి అనుగుణంగా లేదు ఫ్యాక్టరీలో పనిచేయడం అక్కడి

పద్ధతి వారికి ఎప్పటికీ కొత్తగానే వుంటాయి మన పారిశ్రామిక యజమానులలో చాలా మందికి పరిశ్రమలకు సంబంధించిన అనుభవం లేనేలేదు గత 10 ఏళ్ళలో యేర్పడిన కొత్త అవకాశాలదృష్ట్యా అనేకమంది క్రొత్తగా రంగంలోకి వచ్చారు. అందువలన విదేశీపద్ధతి మనకు

---

(12 వ పేజీ తరువాయి)

ఇండియా ప్రభుత్వముచే ఏర్పాటు చేయబడిన కేస్కర్ కమిటీ యీ ప్రశ్నకు సమాధానమియ్యగలుగును. అట్టి సమాధానము తదితరయ ప్రస్తుతపు సమాచారములతో మిశ్రమము గందరగోళము చేయబడరాదు.

న్యాయతః విచారించినచో కమిటీ వారికి కూడ తెలియబడిన పన్ను విధించు సూత్రము తెలియులేని పరిస్థితిలో నిర్దుష్టముగా యేదియైనను చెప్పుట (ఇదమిద్ధమని చెప్పుట) కష్టతరము కూడాను కాని ఒక విషయమును పరిశీలించుటకు ఒక కమిటీని యేర్పాటుచేసి వారి రిపోర్టు కొరకు ఆగకుండ ఉన్న క్లిష్టపరిస్థితులకుఇంకను కొన్ని చేర్చుచునుండుట అసంమజసమని చెప్పవలసి వస్తున్నది. ప్రస్తుతపు దేశ పరిస్థితియందు ప్రభుత్వమునకు సహాయము చేయు నాతురతలో మేమే ప్రప్రథములుగా నున్నను కమిటీవారి రిపోర్టు వచ్చు లోపుగా ఈ పరిశ్రమపై అన్ని విధములగు పన్నుల పెంపుదలకును మా తీవ్రమగు అసమ్మతిని తెలుపుచున్నాము అట్టి తోడ్పడవలయునన్న విషయమే ఈ పరిశ్రమనుతనయసమ్మతినితదితరరూపమునుదాల్చనీయక మిక్కిలి సవినయముగా తిరిగివిచారించగలందులకు మాత్రమే మనవి చేయుచున్నది.

: — :

యెంతమాత్రం తగదు. పరిశ్రమల పరిసరాలలో కొన్నితరాలుగా నివసించినవారి మనస్తత్వం వేరు. గ్రామాలనుంచి నగరాలకువచ్చిన కార్మికులకు అక్కడి వాతావరణమంతా కొత్తగా వుంటుంది. యజమానులు ఈ విషయాన్ని గమనించాలి. ఈ విషయంలో కార్మిక సంఘాలు చేయవలసిందికూడా యెంతోవుంది. ఆంధ్రలో నమోదు చేయబడిన కార్మికసంఘాలు 550 మాత్రమేవున్నాయి. వారి ఆర్థికపరిస్థితిని మెరుగుపరచి కార్మికవ్యవస్థను పటిష్ఠంచేయటానికి కృషి యెంతో అవసరం. ఈ పరిస్థితులలో యజమానులూ – కార్మికులమధ్య విభేదాలు పొడసూపడంలో ఆశ్చర్యంలేదు.

వ్యవసాయ కార్మికుల విషయంలో పరిస్థితి వేరు. పారిశ్రామిక సంస్థలకూ, పారిశ్రామిక కార్మికులకూ మధ్య అట్టిసంబంధము యెందుకు సాధ్యంకాదో ఆశ్చర్యంగావుంది. పారిశ్రామిక సంస్థలలో ఇట్టి సత్సంబంధాలుండాలంటే సహకార ప్రాతిపదికపై ఏర్పడే పారిశ్రామిక సంస్థలకు ప్రోత్సాహ మివ్వడం అవసరం. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో సుమారు 1600 ల పారిశ్రామిక సహకార సంఘాలు నమోదయ్యాయని నాకు తెలుసు. ఇంకా అనేక సహకార చక్కెర ఫ్యాక్టరీ లున్నాయి కూడా. సహకార ప్రాతిపదికపైన ఏర్పడిన సంస్థలకు సర్వవిధాలా ప్రోత్సాహమివ్వడం అవసరం. ఈ సహకార చక్కెర ఫ్యాక్టరీలలో కూడా రైతులే వాటాదారులు. ఫ్యాక్టరీ కార్మికులకు కూడా ఈ సౌకర్యాన్ని విస్తృత పరచాలి. కార్మికులు, యజమానుల మధ్య సత్సంబంధాలు నెలకొనడానికి ఇదే వుత్తమ పద్ధతి.

కార్మిక – యజమాని సంబంధాలు ఉత్తమ తరహాలో వుండడం వల్ల కలిగే ఫలితాలేమిటి? ఇది మూడు విధాల సత్ఫలితాలనిస్తుందని నా వుద్దేశ్యం. మొదటిది కార్మికులు, యజమానుల మధ్య ఇష్టపూర్వకమైనటువంటి సహకారం సుసాధ్యమౌతుంది. ఇట్టి సహకారాన్ని సాధించడానికి కర్మాగారం స్థాయిలోనూ, పరిశ్రమ స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ సంయుక్త సంఘాలను నెలకొల్పడం అవసరం. జాతీయ స్థాయిలో పారిశ్రామిక సంఘాలూ వున్నాయి. తదితర త్రైపాక్షిక సంఘాలూ వున్నాయి. కార్మికులూ, వారి ప్రతినిధులూ ఈ చర్చలలో పాల్గొనేటట్లు ప్రోత్సహించాలి. అందువల్ల ఆ చర్చల ఫలితాలను చట్టాలలోనూ పేర్కొనవీలౌవుతుంది. కేంద్ర స్థాయిలో సరిగ్గా ఇదే పద్ధతి అనుసరించబడుతోంది.

సమస్య సంప్రదింపుల పద్ధతి ఫలప్రదమవ్వాలంటే పటిష్ఠమైన కార్మిక సంఘాలుండడం అవసరం. ఈ విషయమై కార్మిక సంఘాల ప్రతినిధులు ప్రత్యేకంగా శ్రద్ధ వహించాలి. ప్రతిదాని కోసమూ ప్రభుత్వాన్ని అభ్యర్థించడం ఎంత మాత్రమూ మంచిది కాదు. కార్మికులు స్వశక్తిపై ఆధారపడి వుండేటట్లు చేసేందుకు ప్రభుత్వం సమగ్రమైన కార్మిక విద్యా పథకాన్ని రూపొందించి అమలుజరుపుతోంది. కార్మికులు ఈ పథకాన్ని పూర్తిగా వినియోగించుకోవాలి. సమస్య సంప్రదింపుల పద్ధతి పూర్తిగా రూపొందించబడే వరకూ సమస్యల పరిష్కారానికి మరో పద్ధతిని చూసుకోవడం అవసరం.

(మిగతా 17 వ పేజీలో)

# గెడ్డిస్‌కమిటీ రిపోర్టుపై అభిప్రాయములు

రోడ్డు రవాణా రైలు మార్గపు రవాణాల ఉత్తమోత్తమమగు సమానత్వమును, యీ రెండు విధములగు రవాణా సాధనముల విషయములో తెలివిగల పెట్టుబడి విధానమును చేకూర్చుకొనుటయు వీటిని రవాణా రంగమునందు (శాఖకు) కొంతభాగము మాత్రమేవున్న గ్రామముల సమస్యల వంటి సంబంధించిన విషయములతో సమీకరణ చేయుట వంటి విశాలమగు సమస్యలు రోడ్డుపై సరకుల రవాణాకు లైసెన్సుల నిచ్చుటవంటి కొద్దిపాటి రంగములో జరుగు మార్పుల వల్ల పరిణామమును (మార్పును) చెందును అని వాదించవచ్చును. ఈ వాదన అంగీకరింపబడజాలదు. (గెడ్డిస్ సిఫార్సు ఫలితముగా) అద్దెకు ప్రతిఫలమునకు జరుగు రవాణా రంగములో అత్యధికమగు రవాణా దానంతట యది అభివృద్ధి చెందునని గాని లేక లైసెన్సుల నిచ్చు పద్ధతి తీసివేయుట మాత్రము చేతనే రోడ్డురవాణా రైలు మార్గపు రవాణాల మధ్యనున్న సమానత్వములో గమనింపదగిన మార్పునకు మార్గదర్శకముగా నుండగలదని గాని భావించుటకు వీలులేదు కాబట్టి ప్రభుత్వపు విధానముపై యీ వ్యాఖ్యానములు ప్రస్తుతపు లైసెన్సుల నిచ్చు విధానము కొనసాగింపబడుట రద్దు చేయబడుట యనువాటితో నిమిత్తము లేకుండ వర్తించుచు, ప్రధాన సమస్యయగు రోడ్డు రవాణా రైలురవాణాలకు మధ్య సమానత్వము నెట్లు సముపార్జింపనగుననెడి విషయముతో ప్రారంభింపవలెను.

గెడ్డిస్ కమిటీ సరకుల జేరవేతకు అందుపాటగునంత రైలు మార్గపు సౌకర్యములను అధికతరముగా నుపయోగించుటను పెంపొందించుట ప్రభుత్వము నిర్వహింపనూహించుచున్న పనుల జాబితా యందొకటిగా నమోదు చేసినది. ఇది అభిలషింపదగిన పనులలో నొకటి యగునా కాదా యనునది. యీ కమిటీకి పంపబడిన చర్చనీయాంశములలోనిది కాదు అయినను అది నిర్వహింపబడు మార్గములను వారు పరిశీలించిరి. వారు తేల్చిన పరియవసానమేమనగా యిటీవల జరిగిన సంవత్సరములలో రైలు మార్గములకు లైసెన్సింగ్ విధానమునకు తోడ్పడనూలేదు. లైసెన్సింగు విధానపు యే సవరణగాని మరియే యితర భౌతిక రూపమగు నిర్బంధముగాని పై తన శక్తిని చూపుటకు ట్రాఫిక్‌ను మార్పుదల చేయుటకు మంచి సాధనముగా నుండజాలదు అని

దీనికి కారణము రవాణాతో యేమాత్రమైన సంబంధముగల మన యందరకును సుస్పష్టము సరకులను జేరవేయు యే రెండు మార్గముల తీరును యెప్పుడును సరిసమానముగా నొకే తీరున నుండవు. గమన వేగములోగాని ధరలో గాని, నమ్మకముగా నాధారపడి యుండగలుగుటలోగాని వీలుననుసరించి మార్పు చేసుకొనుటలోగాని, మూల ధనమును కట్టివేసి యుండుటలోగాని వర్తక పన్నుల విషయములోగాని – యివి యింకను అనేక విషయములను ఒక రకమగు ట్రాఫిక్‌ను నడుపుటకు ఉత్తమ

(15 వ పేజీ తరువాయి)

ప్రభుత్వం ఆధ్వర్యం కింద యజమానులూ, కార్మికులూ సమావేశమై సమస్యలను పరిష్కరించుకునేందుకు ఒక పద్ధతిని రూపొందించాలి. మనదేశ పరిస్థితుల కనువైన సమస్య సంప్రదింపుల పద్ధతి త్రైపాక్షిక వేతన నిర్ణాయక సంఘాన్ని నియమించటం.

మూడవది ఇటు పారిశ్రామిక వివాదాల విషయంలో ఉత్తమమైన పద్ధతి అసలు వివాదాలు రాకుండా చూడడమే ఇందుకు కూడా ఒక ఉత్తమమైన పద్ధతిని రూపొందించుకోవాలి. వివాదగ్రస్తాంశాలను కార్మిక ప్రతినిధులతో చర్చించేందుకు యజమానులు సిద్ధంగా వుండాలి

క్రమశిక్షణ నియమావళిలో ఈ పద్ధతి నిర్దేశించబడింది. ఇక యజమానులూ, కార్మికులూ వివాదాలను పరిష్కరించుకోలేనిపరిస్థితిలో వారు స్వచ్ఛందంగా ఆసమస్యలనుపరిష్కర్త తీర్పుకు పంపాలి. ఈ పద్ధతి మనకేం కొత్తకాదు మన గ్రామాలలో ఈ నాటికీ ఈ పద్ధతి అమలులో వుంది. గ్రామ సీమలనుంచే వచ్చిన మన కార్మికులు ఈ పద్ధతికి సులభంగా అంగీకరిస్తారు. యజమానులు కూడా ఇందుకిష్టపడాలి ఈపద్ధతులన్నీ విఫలమైనపుడే పారిశ్రామిక వివాద చట్ట నిబంధనలు వినియోగించుకోవాలి ప్రజాస్వామిక వ్యవస్థ పరిరక్షణకు కార్మికుల స్వేచ్ఛను పరిహరించడం పాటికాదు. ఎట్టి పరిస్థితులలోనూ పని నిలుపుదల తగదు అందుకే వివాదాలను తీర్పు సంఘానికి పంపించేందుకు చట్టరీత్యా అవకాశం కల్పించడం జరిగింది.

దేశశ్రేయస్సు కోసం అవసరమైనపుడు కార్మికులు శక్తియుక్తు లన్నిటినీ వినియోగించి పని చేయగలరని. ప్రస్తుత అత్యయపరిస్థితి నిరూపించి ది యజమానులు, కార్మికుల మధ్య సత్సంబంధాలను నెలకొల్పేందుకు ఉత్తమ పద్ధతిని రూపొందించాలి అంటే కార్మికుల మనస్సులలో మెదిలే భావాలను గ్రహించి మన వనరులకు లోబడి వారికి తగు సౌకర్యాలను కూర్చడం అవసరం.

ఆంధ్రప్రదేశ్ కు సంబంధించినంత వరకు పారిశ్రామికంగా దానికి ఉజ్వల భవిష్యత్తు వుందని నా అభిప్రాయం. దానికి అపారమైన వనరులున్నాయి. కార్మిక, యజమాని సంబంధాల ఉత్తమ పద్ధతిని రూపొందించగలిగితే, పారిశ్రామికాభివృద్ధి కృషి సాఫీగా సాగిపోతుంది. ఈ గోష్ఠిలో పాల్గొనేవారు ఈ అంశాన్ని తుది వరకూ దృష్టిలో వుంచుకోగలరని నా ఆశ”. ♦

---

మగు మార్గమేది యనునది నిర్ణయించుటలో సంబంధముగలవి. దీనినిబట్టి నిరూపింపబడు నదేమనగా రోడ్డు రవాణా పరిధి నుండి రైలు రవాణా మార్గమునకు భౌతిక సాధనముల ద్వారా మళ్ళింపబడునట్లు జేయుటకైన నిర్ణయము శక్తివంతముగా చేయబడవలసి యుండినచో ప్రతి వ్యక్తిగత సందర్భమును విడివిడిగా పరిశీలింపవలసి వచ్చును. అట్టి పరిశీలన అట్టే లోతుపాతులకు పోకుండుటచే నిరుపయోగకరముగా నైనను లేక మూలము నుండి విపులముగా చేయబడవలసి వచ్చుటచే దీర్ఘకాలము పట్టునదిగా నుండవలసి వచ్చును. అప్పటికిని నిర్దుష్టమగు సుస్పష్టమగు నిర్ణయముల కవకాశము లేనిదిగా నుండును

భౌతిక కంట్రోళ్ళను త్రోసిపుచ్చుటచే కమిటీకి మూడు ఊహింపదగు పనిముట్లు మిగిలినవి. అవి యేవన రోడ్డు రవాణాను నుద్దేశించిన నిరోధించుచట్టపు చర్యలు రైలు మార్గపు రవాణాపై చార్జిలు తగ్గించుట (దీని యర్థము చేయదలచుకొన్నది తలక్రిందు క్రమములో పూనుకొనుట) మూడవది రైల్వే పద్ధతిని శక్తివంతముగా పెంపొందించుట.

దీనికి ప్రత్యామ్నాయంగా (మరియొక మార్గముగా) మన మందరమును బ్రిటిష్ రైల్వేల బోర్డు క్రొత్త సర్వీసులను అభివృద్ధి పరచుచు, ప్రస్తుత మున్న వాటిని బలపరచుచు, వాటి నుపయోగించు వారల యవసరముల కనుగుణముగ జేయుచు, నిరుపమానముగా జేరవేయు పరికరములుగల రైల్వేలు ట్రాఫిక్‌ను ఆకర్షణ చేయు పద్ధతిని నిరాటంకముగా కొనసాగింపనిచ్చుట అత్యధికముగా నభిలషింప తగినంతగా నెంచుదుము. ఈ తీరునందే ఉద్బోధకమును, శక్తివంతత్వమును గలవనితోచును విచారణలు సలుపబడుచుండగా రోడ్డురవాణాతో పోటీచేయు ప్రయత్నములోరైల్వేలు అనుచితముగా (అధర్మముగా) ఆటంకపరుపబడుచున్నవని మనము కనుగొనినచో, అప్పుడు మనము స్పష్టముగా వాటిని తొలగించవలెను.

ప్రస్తుతము విచారణీయ సూత్ర మటుండగా ట్రాఫిక్‌ను పై అస్వాభావికపు (కృత్రిమపు) సాధనలచే ప్రభావమును చూపుటకు ప్రయత్నించుటలో, పన్ను విధించు పద్ధతి నుపయోగించుటయందు అది సామాన్యముగా అందరమును వర్తించినచో, రోడ్డుపైనుండు యావత్తు ట్రాఫిక్‌నకును ఖర్చును పెరుగుదలచేయు నిశ్చయముగు నష్టముచే బాధితమగును. నిస్సందేహముగా మనము తక్కువ రవాణాఖర్చుల వాటియందే పోవలయును గాని, హెచ్చు రవాణా ఖర్చుల వాటిలో సంచరింప జాలము. ఈ యిబ్బందిని యధిగమించుటకు, అది పూర్తిగా జయించ బడ జాలనప్పటికిని, కొన్నిటి నన్ని పన్ను విధింప జూచినచో యే యే రకపు ట్రాఫిక్ విచక్షణా జ్ఞానముతో మళ్ళింపజేయనగునో నిర్ణయించుటకు ప్రభుత్వము శక్తిని కలిగి యుండవలెనని ఊహింపవలసి యుండును. రవాణా సంబంధమగు నిర్ణయమునందు గుమికూడియుండు అనేకములగు విషయములను మనస్సునం దుంచుకొని యుపయోగదారుస్థానే ప్రభుత్వముగానీ, తదితరు లెవరుగాని అమితమగు గందరగోళము, అస్థిమితము, అసమర్థత, కలుగజేయకుండగ దీనిని యెన్నుకొన గలుగునని నమ్మ నలవికాదు.

గెడ్డిసు కమిటీ కొన్ని విశేషణములనే జేర్చి ఆమోదించిన మూడవ పనిముట్టుగా చార్జీలు తగ్గించుటను గూర్చి ప్రస్తావించునపుడు, యీ యాంశమును కమిటీ విచారించి, పరిమితి లోపలనే నుపయోగింబడుచున్నదని సుస్పష్టము చేయబడుచున్నది. ప్రయాణికుల రంగములో సబ్‌సిడీసు నుపయోగించుటపై వ్యాఖ్యానింపబడుటలేదు. లేక యింకను ప్రత్యేకించి కమ్యూటర్ సర్వీసుల విషయములోనూ కాదు. కాని సరకుల రవాణా నాకర్షించుటయందు సాధనముగా మాత్రమే. ఈ ఉపపాదనను గురించి మన మందరమును చాల విశాల హృదయులమయి యుండవలయునని తోచును ఇపుడు మనము విచారించుచున్న రంగములో పన్ను విధింపు

నుపయోగించుట కంటె సూత్రప్రాయమునం దిది భిన్నముగా కనుపడదు పన్ను విధి పువలె యిది రవాణాఖర్చులను తిన్నగా హెచ్చు చేయదు. దీనికి కారణ మేమనగా యీ సందర్భములో భారము మరియొకచోట భరింపబడుచున్నది అనగా సామాన్యపు పన్ను చెల్లించు దానివలన, రైల్వేవారు యీ సబ్ సిడీ యుపయోగమును చాల అనుకూల మగు మార్గములలో నుపయోగించు స్థితిలో నుండుటచే, పన్ను విధించుట నవలంబించుటకు చెందిన కొన్ని యిబ్బందులను అది అధిగమించుచును అత్యధిక శక్తివంతమగు రవాణా పద్ధతి తారుమారుచేయు ప్రమాదముకూడ దానితోబాటు యిమిడియున్నది.

రోడ్డురవాణా నుండి రైలుమార్గపు రవాణాకు ప్రేరేపించుపద్ధతియందలి మూల సూత్రమును విచారించుటలో సమస్యను యీ తీరున ఉదహరింతుము. "రవాణారంగపు విధానములో ప్రభుత్వముయొక్క కర్తవ్య మేదిగా నుండవలెను" అని సరకుల చార్జీలవిషయమై రోడ్డురైలురవాణా పద్ధతులమధ్య నుండు తారతమ్యములను ప్రత్యేకముగా గుర్తించుకొనుచూ, రోడ్లపై సరకుల రవాణా నిమిత్తమై లైసెన్సుల నిచ్చు విధానమును యేర్పాటు చేయుటలో ప్రభుత్వముచే నెరవేర్చబడ (సాధింపబడ) నుదేశింపబడినవిగా గెడ్డిస్ కమిటీవారి వలన పరిశీలింపబడిన ఆ అయిదు అయిటములే రోడ్డురవాణానుండి రైలు మార్గపు రవాణాకు మళ్ళింప ప్రేరేపించు విధానమునకుకూడ సమానముగా వర్తించును. అవే వనగా జనసమ్మర్దమును చక్కపరచుటకును వసతి, రోడ్డుపై రక్షణ, సమర్థత కలిగించి రైల్వే మార్గము లందును, పరికరము లందును ప్రస్తుతమున్న మూలధనపు పెట్టుబడిని యింకను బాగుగా వినియోగపరచుటకును.

రోడ్డుమార్గమునుండి రైలు మార్గమునకు ట్రాఫిక్ యొక్క యే యూహింపగల మార్పుదలయును, రోడ్డుపైపోవు మొత్తపురవాణాలో అత్యధికమైన శాతము (బహుశః అంతకంటె చాలా తక్కువ కావచ్చును) ట్రాఫిక్ సమ్మర్దము, వసతి వాతావరణ పరిస్థితులు, రోడ్డురక్షణపై పూర్తిగా ఉపేక్షింపతగిన పరిణామము కనుపరచును. మనము ప్రస్తావించుచున్న విషయములో యేటేట 10 లక్షలసంఖ్యతో పెరుగుచును, ప్రస్తుతమున్న మొత్తపు 12 మిలియనుల లారీలలో 20,000 అంచనా వేయవచ్చును. ఏ దృక్పథమునుండి చూచినను ఈ మూడు సాంఘికసమస్యలకును గమనింపబడని తోడ్పాటు. అంతియగాక, ప్రత్యేకముగా నగరములలోనే ఉద్భవించుచు, ట్రంకురోడ్డురవాణా రైలు మార్గము మూలముననే జరుగునట్టిఫలితముగా మార్పు చెందని, జనసమ్మర్దము, వసతియను సమస్యలకే మాత్రమును తోడ్పడదు వివరమైన పరిశీలన వలన రోడ్డురవాణాయందు 6 శాతము చార్జీని బదలీచేసినపిదప నిర్మాణము చేయబడవలసిన రోడ్లయల్లిక, అట్టి మార్పుదల జరగనిపక్షమున అవసరమగు రోడ్లఅల్లికకును విశేషమగువ్యత్యాసమేమియు నుండదు. భయపడవలసిన దేమనగా- యేలాగైనా ఈ యిరువదియవశతాబ్దపు చివర పావుభాగములో మన కమ్యూనికేషనుల విధానమును మన కవసరమగు స్థాయికి పెంపొందింపవలసినచో; వాటి కవసరమగునంత మూలధనపు పెట్టుబడిలో భాగమును రోడ్లు పొంద

# ఆంధ్రప్రదేశ్ మోటారుబండ్ల చట్టము – సవరణలు

మోటారుబండ్లు – పన్నువిధింపు – 1963 సం॥రపు మోటారుబండ్ల చట్టము–సరకులబండ్లు అంతర్రాష్ట్రీయ రహదారులయందు సరకుల బండ్లుపోవుటకు ఆంధ్రరాష్ట్ర–ఢిల్లీ ప్రభుత్వముల మధ్య పరస్పర ఒప్పందములు ఢిల్లీ ప్రదేశములో రిజిష్టరుకాబడిన సరకులబండ్లు, ఈ రాష్ట్రములో తిరుగుటకు పన్ను చెల్లింపకుండునట్లు మినహాయింపు – ప్రచురణ.

హోమ్ (రవాణా II) డిపార్టుమెంటు
20, నవంబరు 65

జి. ఓ హెచ్. యస్. నెం. 2341

ఈ దిగువనుదహరించినది గమనింపుడు —

1. 16–11–65 తేదీగల జి. ఓ ఆర్. డి నెం. 3704 హోమ్ (టి. ఆర్. I)
2. ఆంధ్రప్రదేశ ట్రాన్సుపోర్టు కమీషనర్ వద్ద నుండి యల్ ఆర్ యస్. నెంబర్లు 16079/E I/64 వరుసగా 30–6–1965, 14–10–1965 తేదీలుగల

ఉత్తరువు : ఆంధ్రప్రదేశ గెజిటునందీ దిగువ ప్రచురణ తెలియజేయబడవలెను.

: ప్రచురణ :

1963 వ సం॥రపు ఆంధ్రప్రదేశపుమోటారు బండ్ల పన్నువిధింపుచట్టపు (1963నందు ఆంధ్రప్రదేశపు 5 వ చట్టము) 9 వ సెక్షనులోని 1 వ సబ్ సెక్షనుక్రింద చెందజేయబడిన అధికారము ననుసరించి, ఆంధ్రప్రదేశ గవర్నరు యిందుమూలముగా సదరు చట్టము క్రింద, పన్ను చెల్లింపవలసిన, ఢిల్లీసంయుక్తప్రదేశము నందు రిజిష్టరుకాబడి, ఆంధ్రప్రదేశ మందును, ఢిల్లీసంయుక్త ప్రదేశమునందునుకూడ గల రహదారులందుపోవు, స్థిరపర్మిటుపై యాంధ్రప్రదేశములో కౌంటర్ సిగ్నేచర్సు కలిగిన, పబ్లిక్ కేరియర్ల, ప్రైవేట్ కేరియర్ల విషయములో మినహాయింపును మంజూరు చేయుచున్నారు

ఇది వర్తించుటకు నియమములు :

1) ఆంధ్రరాష్ట్రము వలననున్న, ఢిల్లీ సంయుక్తప్రదేశము వలననున్నకూడా ఆ రహదారి అట్టిదిగా గుర్తింపబడి యుండవలెను.

2) అట్టి ప్రతి రవాణాబండియును ఆంధ్రరాష్ట్రముయొక్కయును, సంయుక్త ప్రదేశముయొక్కయును మధ్య జరిగిన ఒప్పందఫలితముగా మంజూరు చేయబడిన పర్మిటుయొక్క షరతుల ననుసరించి నడుపబడవలెను

3) ఢిల్లీ సంయుక్తప్రదేశమునందు తాత్కాలికముగా నమలులోనున్న యెట్టిచట్టము క్రిందగాని చెల్లింపబడవలసిన అట్టిబండి తలూకు పూర్తిగా చెల్లింపబడి యుండవలయును.

(సం)
ప్రభుత్వపు డిప్యూటీ సెక్రటరీ.

గల సావకాశ ముండేటట్లులేదని ఈ విషయములోను, తదితర మార్గములయందువలెనే రవాణా యనునది యిప్పుడు దానికున్న ప్రాధాన్యత, ఆధిక్యతకంటె మించినస్థితికలిగి యుండవలెను.♦

హోమ్ (రవాణా I) డిపార్టుమెంటు
18, డిశంబరు 65

జి ఓ యమ్ యస్ నెం 2520

: సవరణలు :

సదరు నిబంధనలలో, —

1) 62 వ నిబంధన తీసివేయబడవలెను.

2) 275 వ నిబంధన తదుపరి ఈ క్రింద నుదహరింపబడు నిబంధన చేర్చబడవలయును.

అదేదనగా,

"275 – ఏ – పబ్లిక్‌సర్వీస్ బండియందు వదలివేయబడిన యాస్తివిడుదలజేయుట"

1) పబ్లిక్‌సర్వీస్‌బండియొక్క ప్రతి కండక్టరుగాని, తన యధీనమందుగల తదితర వ్యక్తిగాని, యే పర్యటనగాని, ప్రయాణముగాని ముగిసినవెంటనే బండియందేదయిన యాస్తి వదలిపెట్టబడిన వైనమును జాగ్రతగా తనిఖీచేసి, సాధ్యమైనంత త్వరలో, యెట్టి పరిస్థితులలోనైన 24 గంటల లోపుగా ఆ బండియొక్క పర్మిటుదారునకు వప్పజెప్పవలయును.

2) అట్టియాస్తిపైగల యే గుర్తులేక రంగు మూలమున నా యాస్తియొక్కయజమానుని వివరములు లభించినచో, ఆ బండియొక్క పర్మిటుదారు, ఆ యజమానునికి ఒక నోటీసును, అట్టి నోటీసు అందిన పక్షమురోజులలోగా ఆ యాస్తిని తీసికొనిపోవలసినదిగాజారీచేసి, ఆవ్యక్తి వచ్చినయెడల అతడే ఆ యాస్తికి సరియైన హక్కుదారుడని తాను క్రమముగా తృప్తిచెందినపిదప ఆయాస్తి అతనికి వప్పజెప్పబడవలయును.

3) ఆ యాస్తియొక్క యజమానుడు తెలియబడకపోయినను, లేక యతనికి నోటీసు అందజేయబడజాలకపోయినను, లేక నా యాస్తి యజమానునికి నోటీసు అందినను తనయాస్తిని తీసికొనకుండినను, ఆ బండి పర్మిటుదారు ఆ ఆస్తి తన స్వాధీనములోనున్నట్లు తన నివాసస్థలమందుగాని, వ్యాపారస్థలమందుగాని ప్రదురణజేసి ఆ యాస్తియొక్క యజమానుని తెలిసికొనుటకును, కనుగొనుటకును ఆ యాస్తి నతని కిచ్చుటకును సబబైన యే తదితర చర్యలుగాని తీసికొనవలెను. పర్మిటుదారు అంతవరకును ఆ యాస్తిని సురక్షితముగా వుంచుటకై సబబైన జాగ్రతను తీసికొనవలయును.

4) ఆ యాస్తిని తీసికొనుటకై ఆయజమాని రానియెడల ఆ బండి పర్మిటుదారు 3 వ ఉపనిబంధనక్రింద తనవలన చేయబడిన నోటీసుప్రచురణతేదీనుండి, 30రోజులకు తక్కువగానికాలము తదుపరిని, ఆ ఆస్తి నమ్మి ఆ క్రయధనమును రాష్ట్రప్రభుత్వమునకు జమకట్టవలెను. కాని ఆయాస్తి త్వరితముగా శిథిలావస్థజెందునని ఆబండి పర్మిటుదారు తలచినచో, అట్టి కాలపరిమితి గడచిపోకపూర్వ మెప్పుడయినను, ఆ యాస్తిని అమ్మకముజేయవచ్చును.

వివరణము :— ఈ నిబంధన సందర్భములో 'పర్మిటుదారు' అను పదము ఆంధ్రప్రదేశ

(తరువాయి 23 వ పేజీలో)

రూలు _ 8 (4 B)

1. ప్రచురణ స్థలం : కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు, విజయవాడ_2.
2. ప్రచురణ కాలం : మాసపత్రిక — నెలకొకసారి
3. ప్రింటరుపేరు : జిల్లేపల్లి భాస్కరరావు
   జాతి హిందూ
   చిరునామా కాంగ్రెస్ ఆఫీస్ రోడ్, విజయవాడ_2.
4. పబ్లిషర్ పేరు : జిల్లేపల్లి భాస్కరరావు
   జాతి హిందూ
   చిరునామా కాంగ్రెసు ఆఫీసు రోడ్డు, విజయవాడ_2.
5. ఎడిటర్ పేరు : జిల్లేపల్లి భాస్కరరావు
   జాతి హిందూ
   చిరునామా కాంగ్రెసు ఆఫీసు రోడ్డు, విజయవాడ_2.
6. యితర వివరములు : లేవు

పైన పేర్కొనబడిన వివరములను జిల్లేపల్లి భాస్కరరావునైన నేను నాకు తెలిసినంత వరకు యదార్థములని తెలియజేయుచున్నాను.

జిల్లేపల్లి భాస్కరరావు,
పబ్లిషర్ సంతకం.

---

ఆంధ్రప్రదేశ్ స్టేటు ట్రాన్సుపోర్టు అథారిటీ శక్రటరీ
శ్రీ జి. యల్. బాలకృష్ణారెడ్డి, బి. ఏ గారి

# టూరు ప్రోగ్రాము

| | |
|---|---|
| 5 _ 2 _ 66 | హైదరాబాదునుండి నాగార్జునసాగర్ మీదుగా గుంటూరుచేరి ఆర్. టి. ఓ. ఆఫీసులో డి. సి. బి. రిజిష్టర్లు తనిఖీచేసి ఒంగోలు వెళ్ళి అచట రాత్రికిమకాముచేసెదరు |
| 6 _ 2 _ 66 | నెల్లూరువెళ్ళి ఆర్. టి ఓ. ఆఫీసులో డి. సి. బి. రిజిష్టర్ల తనిఖీ చేయుదురు. |
| 7 _ 2 _ 66 | ఉదయం నెల్లూరులో వుందురు. మధ్యాహ్నం బయలుదేరి ఒంగోలుచేరి ఆ రాత్రి అచట మకాంచేయుదురు. |
| 8 _ 2 _ 66 | తిరిగి హైదరాబాదు చేరుదురు. |

ఆటోమొబైల్ టెక్నీషియనుల అసోసియేషన్ వారి వార్షికసభలో

# మంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ప్రకటన



విజయవాడపట్టణంలో 'ఆటోనగర్' నిర్మాణము త్వరలోనే సాధ్యంకావచ్చునని అందుకు అధికారులు 270 ఎకరాల స్థలాన్ని పరిశీలించి ప్రతిపాదనలు పంపించారని, ఇప్పుడు అది ప్రభుత్వ పరిశీలనలో ఉన్నదని, ఆటోమొబైలు టెక్నీషియన్ల అసోసియేషన్ ప్రథమ వార్షికోత్సవసభలో ప్రసంగిస్తూ ఆర్థికపరిశ్రమలమంత్రి డా. ఎం. చెన్నారెడ్డి వెల్లడిచేశారు.

డా. చెన్నారెడ్డి పట్టణంలోని వివిధ ఆటోమొబైలు వర్కుషాపులనుచూచి, పరిస్థితులను అవగాహన చేసుకున్నారు. ఇవి పట్టణంలో రాకపోకలకు ఎంత ఆటంకం కలిగిస్తున్నదీ, విస్తరణకు అవకాశంలేక అభివృద్ధి ఎంత కుంటుపడుతున్నదో గుర్తించుకున్నారు.

ఈ వార్షికోత్సవసభకు శాసనసభ్యులు డా. టి. వి. యస్. చలపతిరావు అధ్యక్షత వహించారు. అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ టి. అప్పారావు స్వాగతంపలికారు. కార్యదర్శి శ్రీ కె. రామమోహనరావు వార్షికనివేదిక సమ

---

(21వ పేజీ తరువాయి)

ట్రాన్సుపోర్టు కా॥ నకుకూడ వర్తించును. సదరు క్రయధనము రాష్ట్రప్రభుత్వమునకు బండ్లపై పన్నుగా విధిపబడినది. తదితర జమలు XI నెంబరు ఖాతాక్రింద జమ కట్టబడవలెను

(సం) ... ...
ప్రభుత్వ డిప్యూటీ సెక్రటరీ.

ర్పించారు. అందులో "ఈ అసోసియేషన్‌లో ఇప్పుడు 196 మంది సభ్యులున్నారు. ఆటోమొబైలు పరిశ్రమలో అనుభవజ్ఞులైన, స్వంత ఆటోమొబైలువర్కుషాపు కలిగి, పరిశ్రమఅభివృద్ధికి క్రొత్తసామానులు తయారుజేయటమే కాక, పాతవాటిని 'రీకండిషన్' చేసి, వాడుటకు మళ్ళీవిధంగా రూపొందించటం జరుగుతుంది. ఈ పరిశ్రమల సుస్థిరతకు ఒక శాస్త్రీయ సాంకేతిక విజ్ఞాన గ్రంథాలయం, ఒక మ్యూజియం, ఒకశిక్షణ కేంద్రం అవసరం"అనిపేర్కొన్నారు.

శ్రీ రాఘవయ్య ప్రసంగిస్తూ, పరిశ్రమఅభివృద్ధికి ముడిసరుకు ముఖ్యంగా ఎక్కువ టన్నేజ్ ఉక్కు అవసరమనీ, దాన్ని ఎల్లకాలమూ విదేశాలమీద ఆధారపడి దిగుమతులు జేసుకొనడం లాభంలేదని, అందువలన ఏర్పడబోయే ఆటోనగర్‌లో ముడిసరుకు ఉత్పత్తిచేసుకుని, పెద్ద యంత్రాలకు అవసరమైన చిన్నచిన్న సహాయ పరికరాలు తయారుచేసుకోవాలనిసూచించారు.

సభాధ్యక్షులు డా. టి. వి. యస్. చలపతి రావు ప్రసంగిస్తూ, లారీలసమస్య విజయవాడ పట్టణంఎంతకాలంనుంచో ఎదుర్కొంటూందని నేను డా. చెన్నారెడ్డి హయాంలో ఆ సమస్య పరిష్కారం కాబోతుందని, విజయవాడలో త్వరలో మాస్టరుప్లాను ఆమోదింపబడితే పట్టణానికి నలువైపులా దూరంగా పారిశ్రామిక వాడలు యేర్పడగలవనీ అన్నారు. మానవుల జబ్బులకు వైద్యులున్నట్లే, లారీప్రమాదాలను అరికట్టే లారీవైద్యులు ఆపరేటర్లని వివరించి, ఈ ప్రమాదాన్ని అరికట్టగలిగితేగాని, ప్రజల మన్ననలు పొందలేరు అని హెచ్చరించారు. అందుకు డ్రయివర్ల సమావేశంజరిపి నివారణోపాయాలుఅన్వేషించాలని, అవసరమైతే డ్రయివర్లకు శిక్షణకోర్సులు విజయవాడలో స్థాపించాలని సూచించారు

మంత్రి శ్రీ చెన్నారెడ్డి తమ ప్రసంగంలో దేశంలో పెద్దయెత్తున ప్రజలలో కదలిక కనిపిస్తోందని, ఈ జగన్నాథ ప్రజారథాన్ని ఇక యెవరూ ఆపలేరని, ఆ రథం ఇంకా త్వరితగతిని పురోగమించడానికే మనమంతా కృషిజేయాలని అన్నారు. విజయవాడ పౌరులు సంకల్పించినంత మాత్రానే సాధించగల శక్తివంతులని ఒక్కొక్క నాయకునిపేరుతో సేవాదళాలు స్థాపించగల సమర్థులనీ, వారు తమశక్తినంతా పారిశ్రామిక అభివృద్ధివైపుకు మరలిస్తే విజయవాడ పట్టణం ఆంధ్రదేశానికి గర్వకారణం కాగలదు అన్నారు. డ్రయివరు, దర్జీ, క్షవరవృత్తి మొదలగువాటికి సంఘంలో గౌరవస్థానం సమకూరినట్లయితే విద్యావంతులైన యువకులు ఉద్యోగాలకు ఉబలాటపడకుండా స్వతంత్రంగా యీ వృత్తులు నిర్వహించటానికి ముందుకు రాగలరు అన్నారు. దేశంలో మనకు తెలియకుండానే కాలప్రవాహంవలన ఒక పెద్ద మార్పు వస్తున్నదని, ఇప్పటికీ అనేక వ్యాపార, పారిశ్రామిక, చిన్నచిన్నవృత్తులలో ఎక్కువ విద్యావంతులు కృషిచేస్తున్నారని ముందుతరంలో యువకులు తమ శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని ఆధారం జేసుకుని ఏదోఒకవృత్తికి తయారుకావాలని దానిని కష్టించి సాధించగలుగుతారని, తమ విశ్వాసం ప్రకటించారు.

ఈ 'ఆటోనగరం' పట్టణంలోని ట్రాఫిక్ సమస్యలు, మున్సిపల్ సమస్యలు, పారిశ్రామిక సమస్యలు పరిష్కరించగల ప్రాజెక్టుగా రూపొందగలదని, అందుకు వివిధ శాఖలవారు తమతమభారాన్ని మోయటానికి సిద్ధంగావుండా



జీతాల పెంపుదలకు, కరువుభత్యాలపెంపుదలకు సర్వీసుకమిషనుల మెరుగుదలకు ఈమధ్య ఆర్. టి. సి వర్కర్ల యూనియన్‌వారు కొందరు నిరాహారదీక్షసాగించి, ఆందోళన వ్యక్తపరచారు.

♦ ♦

విజయవాడ సిటీబస్సు ప్రయాణీకులసభ అనేదాన్ని కొంతమంది విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో ఏర్పాటుచేసి, విజయవాడలో సిటీబస్సులసంఖ్యను పెంచాలని తీర్మానించారు. నానాటికి జనాభా పెరుగుదలతోపాటు వివిధమైన సమూఖ్యల వ్యవస్థలు వ్యాపార, విద్యా, వైజ్ఞానిక రంగాలలో ఏర్పడి, విజయవాడ పట్టణం అభివృద్ధి అయిన సంగతిని ప్రస్తావిస్తూ, పెరిగే జనాభా ప్రయాణసౌకర్యానికి సిటీలో రెట్టుకురెట్టు పెరిగిన రిక్షాసర్వీసులు చాలవని, సిటీబస్సులసంఖ్య, సూట్లసంఖ్య పెంచాలని, లేకపోతే, వున్నవాటిలో వసతి చాలదని గోలపెట్టారు. 1951 నాటికి వున్న బస్సులసంఖ్య పెంచవలసిన అగత్యం యెంతయినా వున్నదని తెలియజేశారు.

♦ ♦

తొమ్మిదవ ఆలిండియా పోస్టల్ ఎంప్లాయీస్ యూనియన్ క్లాస్ 2 వారి ఆలిండియా 9 వ సమావేశం ఈమధ్య విజయవాడలో జరిగింది. కేంద్రమంత్రి గా॥ డాక్టర్ కె. యల్. రావుగారు ఈ సమావేశాన్నారంభించారు. ఆలిండియా యూనియన్ ప్రెసిడెంటు కె. సి. బోసు అధ్యక్షతవహించారు. ఆరురోజులు కొనసాగిన యీ సమావేశాలలో పోస్టల్ ఎంప్లాయీస్ ఎదుర్కొనే అనేకసమస్యలు చర్చింపబడ్డాయి. కొన్నికొన్ని ముఖ్యవిషయాలలో ఏకాభిప్రాయంసాగక, కొంతమంది పోస్టల్ పనివారు వేరే యూనియన్ యేర్పాటు తలపెట్టినట్టు వార్త. ఉద్యోగరీత్యా నిత్యజీవితంలో జరిగే చిన్న-పెద్ద రకాల తేడాకూడా ఈ విభజనకు దారితీసిందని వ్యాఖ్య. ఏమైనా మొదటిసారిగా యింత పెద్ద సమావేశాన్ని జరిపేందుకు పూనుకున్న విజయవాడ యూనియన్‌వారు ఏర్పాట్లు చాలా వసతిగా కలిగించి, సభ్యుల మన్ననలకు పాత్రులయ్యారు

♦ ♦

విజయవాడలో 28 వ ఫిబ్రవరినాడు విజయవాడ రైఫిల్ అసోసియేషన్‌వారిచే నడుపబడిన రైఫిల్ పోటీ పందెములలో గెలిచినవారికి బహుమతులు శ్రీమతి నేలంరాజు పొన్నయ్యచే పంచబడినవి ఈ కార్యక్రమాన్ని కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ జాన్‌సన్ పి జయకర్ అధ్యక్షత వహించారు. రైఫిల్ క్లబ్ ప్రెసిడెంట్ కృష్ణాజిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ టి. పొన్నయ్య ప్రారంభము జేశారు. పత్రికలవారు పురప్రముఖులు వచ్చి తిలకించారు. శక్రటరీ శ్రీ పి. రామకృష్ణ సమూఖ్య నివేదిక నిచ్చారు.

—౦—

లని హెచ్చరించారు. ఈ విషయాన్ని సాకల్యముగా చర్చించడానికి పెద్దలందరితో కూడిన విస్తృతసమావేశం మునునాడు ఏర్పాటుచేస్తున్నామని ప్రకటించారు.

### హైర్ పర్చేజి ఎగ్రిమెంటు
### అమ్మకం కాదు
### (అత్యున్నత న్యాయస్థానపు తీర్పు)

మామూలుగా జరుగుచున్న అద్దె కొనుగోలు అగ్రిమెంటు ననుసరించి పెట్టుబడిదారునికి చెల్లించవలసిన నిలచియున్న చిట్టచివరి వాయిదా మొత్తమును యిచ్చివేసినపుడు కష్టమరు మోటారుబండికి హక్కుదారుగా బరిణమించు వ్యవహారము కొనుబడి పన్నుచే బాధితమగునట్టి అమ్మకము కాదని యిటీవల సుప్రీం కోర్టువారు తీర్పు నిచ్చిరి

ఈ యభిప్రాయము ననుసరించి కేరళరాష్ట్రము పై సుందరం ఫైనాన్సు లిమిటెడ్ వారు దాఖలుచేసిన అప్పీలు న్యాయమూర్తులు శ్రీ షా, శ్రీ సికారి వాదనతో నేకీభవించిరి. న్యాయమూర్తి శ్రీ సుబ్బారావు వ్యతిరిక్తపు తీర్పును వెలిబుచ్చుచూ ట్రావెన్కూరు కొచ్చిను జనరల్ సేల్సు చట్టపు నిబంధనల ప్రకారం అది పన్ను విధింపబడగల కొనుబడియే యను కారణముగా అప్పీలును త్రోసిపుచ్చిరి.

ఈ అప్పీలుదారు మోటారుబండ్ల కొనుబడి నిమిత్తమయి పెట్టుబడిని పెట్టెను. కొనుబడి పన్ను నిర్ణయించుటకై రిటర్న్ పంపవలసినదిగా సేల్సుటాక్సు ఆఫీసరు ఆసంస్థకు నోటీసును జారీ చేసెను. అప్పీలుదారు పన్ను విధింపునకొడబడలేదు కాని యీ అభ్యంతరమును (వాదనను) ఆ డిపార్టుమెంటువారును, కేరళ హైకోర్టునూ కూడ నిరాకరించిరి. అప్పెలెంటు తరఫు న్యాయవాది ఆ సంస్థ పెట్టుబడిదారు మాత్రమేననియు కస్టమర్ మోటార్ల విక్రయదారుని వద్దనుండి తిన్నగా తన పేరులో కొనుబడి జరిపినాడనియుం వాదించెను. అందు పెట్టుబడిదారునివలన కస్టమరున కెట్టి విక్రయమును లేదని చెప్పెను.

ప్రభుత్వము తరఫున అద్దెకొనుగోలు యేర్పాటు ప్రకారము అప్పెలెంటునందు బండి క్రయము పొందువాని హక్కులు నిలచిపోయినవని వాదింపబడినది. అప్పు మొత్తముపూర్తిగా చెల్లింపబడినమీదట ఆ హక్కులు నశించి పోగా, క్రయదారు హక్కుగలవాడగుచున్నాడనియు యిది పర్యవసానమునందు అప్పెలెంటు వలన కొనుబడియే నని నుడివిరి.

అధిక సఖ్యాకపు న్యాయమూర్తుల తీర్పును ప్రవచించుచున్న న్యాయమూర్తి శ్రీ షా అద్దెకొనుగోలు అగ్రిమెంటును, తత్సంబంధమగు దస్తావేజులనుబట్టియు జరిగిన వ్యవహారముయొక్క స్వభావము అప్పెలెంటు మోటారు బండ్లను కొనుటకు డబ్బు పెట్టుబడి పెట్టుచు వ్యాపారము చేయుచున్నది కాని, మోటారుబండ్ల క్రయ విక్రయముముల వర్తకము జరుపుటలేదనియు చెప్పిరి. ఆ ఫరం డబ్బు పెట్టుబడిని పెట్టగా క్రయదారు దాని మొత్తమును తిరిగి చెల్లించుటకు ప్రామిసరీనోటును వ్రాసి యిచ్చెను. అగ్రిమెంటు షరతులు అతిక్రమింపబడినపుడు అప్పెలెంటునకు బండి స్వాధీనపరచుకొనుటకు హక్కుగలిగి యుండినను క్రయదారుడే హక్కుదారుడుగా ఉండిపోవుచున్నాడు. అందుచేతమ చివరపర్యాయము సొమ్ము చెల్లింపబడినప్పుడు యెట్టి క్రయమును జరుగుటలేదు అనిరి. అప్పీలును వినిన న్యాయమూర్తులపేర్లు శ్రీ సుబ్బారావు, శ్రీ షా, శ్రీ సిక్రీలు.

ఫోను : 1259 గ్రామ్సు : ప్రెసిషన్

# దుర్గా డీసెల్ హౌస్

[రిజిష్టర్డు]

## మైకో-బాష్ సర్వీస్ ఏజంటు,

గోపాలరెడ్డి రోడ్, **విజయవాడ-2.**

---o---

| | | | |
|---|---|---|---|
| పెర్కిన్సు | మెడోస్ | డేవిడ్ బ్రౌన్ | లిష్టర్ |
| బెంజి | ఫోర్డుసన్ | బైలారన్ | సిడ్లీ |
| లేలెండ్ | ఫెర్గూసన్ | పెట్టర్ | నేషనల్ |

పైన తెలియపర్చిన డీసెల్ ఇంజన్ల పంపులు, పవర్ కేలిబ్రేషన్, అరుగుదల తక్కువగావున్న పాత నాజిల్సు రీ కండిషనింగ్, ఆధునిక యంత్రములపై అనుభవంకల పనివారిచే ఆటోమోబైల్ ఇంజనీరు పర్యవేక్షణ క్రింద సకాలంలో చేయబడును.

"మైకో - బాష్" ఎలిమెంట్సు, నాజిల్సు, ఫిల్టర్సు మా వద్ద సరసమైన ధరలకు లభించును.

